# షేక్‌పేటలో భూ మాయ

**రూ.40 కోట్ల భూమి హస్తగతం ● హౌసింగ్ సొసైటీలో కుంభకోణం ● విచారణలో తేలినా చర్యలకు తాత్సారం**

ఈనాడు, హైదరాబాద్

భూ కుంభకోణాలకు పేరుగాంచిన రాజధాని నగరంలో మరో భూబాగోతం వెలుగులోకి వచ్చింది. దాదాపు రూ.40 కోట్ల విలువైన 7,079 చదరపు గజాల భూమికి కొందరు ఎసరు పెట్టారు. ఈ దందాకు బంజాహిల్స్‌లోని షేక్‌పేటలోని పశుసంవర్ధశాఖ ఉద్యోగుల కోఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ వేదికైంది. ఈ తతంగంపై కోఆపరేటివ్ శాఖ దర్యాప్తు చేసి నిజాలు నిగ్గుతేల్చింది. ప్రభుత్వానికి సమగ్ర నివేదిక సైతం అందజేసింది. ఇప్పటికే నెలలు గడుస్తున్నా... ఇంతవరకు దీనిపై ఎలాంటి చర్యలు తీసుకోలేదు.

పశుసంవర్ధశాఖ ఉద్యోగులు కొంతమంది హౌసింగ్ సొసైటీగా ఏర్పాటై 1982లో షేక్‌పేటలోని సర్వే నెంబరు 74/ఎ, 76ల్లో 11 ఎకరాలను ఎం.గోపయ్య వద్ద కొనుగోలు చేశారు. అందులో సుమారు 7079 చదరపు గజాల భూమిని ఆలయం, సెప్టిక్ ట్యాంకు, షాపింగ్ కాంప్లెక్స్, పార్కు తదితర అవసరాలకు కోసం ఖాళీ స్థలంగా వదిలి మిగతా 110 ప్లాట్లుగా విభజించారు. అయితే తరువాత ఇది మిగులు భూమి కింద తేలడంతో ఇళ్లు కట్టుకునేందుకు ప్రభుత్వం నిరాకరించింది. దీంతో జీవో నెంబరు 455 కింద చదరపు గజానికి ఒక్కొక్కరు రూ.వేయి చొప్పున చెల్లించి 110 ప్లాట్లను క్రమబద్ధీకరణ చేసుకున్నారు. ఖాళీగా వదిలిపెట్టిన 7079 చదరపుగజాలు మాత్రం రికార్డుల ప్రకారం ప్రభుత్వ భూమిగానే ఉంది. తర్వాత ఇక్కడ భూమికి విపరీతమైన ధర పెరగడంతో కొంతమంది కళ్లు ఈ స్థలంపై పడ్డాయి. దీంతో పథక రచన సిద్ధమైంది. అప్పటికప్పుడు కొత్తగా మరో 11 మంది హౌసింగ్ సొసైటీలో చేరిపోయారు. అందులో 9 మంది పేరుతో చకచకా ఆ భూమి క్రమబద్ధీకరణ జరిగిపోయింది. ఈ మేరకు 28-9-2006, 13-2-2007ల్లో జీవోలు 1422, 166 కింద ఈ స్థలాన్ని వారి పేరుతో క్రమబద్ధీకరణ చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు కూడా జారీ చేసింది.

● **చర్యలు ఎందుకు తీసుకోరు?...** పశుసంవర్ధక శాఖ ఉద్యోగుల కోఆపరేటివ్ హౌసింగ్ సొసైటీలో అక్రమాలు జరిగినట్లు రుజువైనా చర్యలు తీసుకోవడంలో ప్రభుత్వం తాత్సారం చేస్తోందని సొసైటీ మాజీ అధ్యక్షులు నారాయణరావు, అసోషియేషన్ డీన్ ఎస్.అమరేంద్రరెడ్డి, ఇతర సభ్యులు రంగారెడ్డి, జయసూర్య, రషీద్ తదితరులు ఆరోపించారు. ఈ మేరకు శనివారం విలేకరులతో మాట్లాడారు. ప్రభుత్వ భూమి అయినా సరే, కనీస అవసరాలకు కేటాయించిన దాన్ని ఎలా క్రమబద్ధీకరణ చేశారని అన్నారు. విచారణలో అక్రమాలు తేలినా చర్యలు తీసుకోవడంలో తాత్సారం చూపుతున్నారని పేర్కొన్నారు. సొసైటీకి చెందిన కొందరు పెద్దలు ఈ తతంగమంతా నడుపుతున్నారని దుయ్యబట్టారు. ప్రభుత్వం స్పందించి తక్షణం చర్యలు తీసుకోవాలని, లేదంటే న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తామని పేర్కొన్నారు.

## నిబంధనలు గాలికి...

అయితే ఈ భూమి క్రమబద్ధీకరణలో నిబంధనలు మొత్తం తుంగలో తొక్కినట్లు తాజాగా అధికారుల విచారణలో బట్టబయలైంది. పార్కు, ఆలయాలు, పాఠశాలలు ఇతర ప్రజా అవసరాలకు వదిలిపెట్టిన భూమిని జీవో 1422, 166ల కింద క్రమబద్ధీకరణ చేయడం నిబంధనలకు విరుద్ధం. అయితే నిబంధనలకు విరుద్ధంగా క్రమబద్ధీకరణ చేశారని తేలింది. అంతేకాక సొసైటీలో కుటుంబానికి ఒక్కరే సభ్యులుగా ఉండాలి. ఆ కుటుంబం నుంచి ఒక్కరే ప్లాటు పొందేందుకు అర్హులు. ప్రస్తుతం ఈ భూమిని పొందిన 9 మందిలో 8 మంది ఒకే కుటుంబానికి చెందిన వేర్వేరు వ్యక్తులుగా విచారణలో తేలింది. సొసైటీలోకి కొత్తవారిని సభ్యులుగా తీసుకోవడం కూడా సొసైటీ చట్టం ప్రకారం చెల్లదు. అయితే ఎప్పుడో ఏర్పాటైన సొసైటీలోకి 13-3-2006న కొత్తగా 11 మందిని తీసుకున్నట్లు చూపి వారిని నిరీక్షణ జాబితాలో పెట్టారు. ఇదంతా నిబంధనలకు విరుద్ధంగా జరిగిందని అధికారులు తేల్చారు. సొసైటీలోని రూ.30 లక్షల నగదు కూడా వేరే వ్యక్తి పేరుతో బయటకు తరలించారు. సొసైటీలో కనీస వసతుల కల్పనకు వీటిని ఖర్చు చేస్తున్నట్లు చూపారు. అయితే అప్పటికే అక్కడ కనీస వసతులు ఉన్నాయని అధికారులు నివేదికలో పేర్కొన్నారు.